M. No Reg. 2580. సం॥ చందా రు 4 లు




జమీందారీ రయితుల ఆర్థిక సాంఘిక వ్యవసాయిక భాగ్యోదయమునకు

సంపుటము 2 | శనివారం 18–3–33 నెల్లూరు | సంచిక 28

# రెండవ రాజకుమారుని సాక్ష్యము

స. ప్రి. ము. కోర్టు స్మాల్ నెం 991 of 32 లో 6-3-1933 తేదిన వెంకటగిరి మహారాజాగారి రెండవకుమారుని సాక్ష్యములోని భాగములు:—

నన్ను మహారాజ కుమారని పిలుతురు. మా దివాను పేరు సుబ్బారావు. రయితులు పెట్టుకొను అర్జీలను దివాను నా వుత్తర్వుల కొరకు పంపడు. తహశీలుదారు కూడ పంపడు. దావాలను చేసే విషయములో నా యభిప్రాయమును వ్రాసి మహారాజాగారికి వుత్తర్వుల నిమిత్తము పంపెదను. శిస్తు రిమిషనుల విషయములోను, కంచెపుల్లరుల విషయములోను రయితులు నాకు అర్జీలు పంపుకొందురు. నేను వాటిపై యే వుత్తర్వులను చేయక విచారణనిమిత్తము తహశీలుదారులకు పంపుదును. వీటిపై కడపటి వుత్తర్వులను మహారాజాగారే చేయుదురు. వీటికి సంబంధించిన కాకితములను దివాను నాకుపంపగా నాయభిప్రాయము వ్రాసి వుత్తర్వుల నిమిత్తము మహారాజాగారికి పంపెదను. సాధారణముగా మహారాజాగారు నాతో యేకీభవింతురు. కదాచితు వ్యతిరేకించుటయుకలదు. మహారాజాగారు లేనప్పుడు విషయ మత్యవసరమైనచో నేనే కడపటి వుత్తర్వులను చేతును. వారు వచ్చినవెనుక వారి వుత్తర్వుల పొందెదను. మహారాజాగారికి నేరుగా రయితులు అర్జీలు యిచ్చుకొనుటయు కద్దు. పై విధముగా 1924, 25 సం॥ మొదలు జరుగుచున్నది. నేను 1924, 25 సం॥లో పరిపాలనాధికారమును స్వీకరించితిని. కుమారరాజాగారుకూడ పరిపాలన యందు శ్రద్ధ వహింతురు. మహారాజాగారు భిన్నాభిప్రాయులయిన విషయములలో తప్ప పరిపాలన యంతయు నామీదుగనే జరుగుచుండును. ఇది రయితుల కందరికి తెలియును.

మా సంస్థానమందు సి. గోపాలు అను ప్రచురణ శాఖాధికారి కలడు. అతను మా సంస్థానము అనుమతి పొందియే సంస్థానమునకు సంబంధించినయేదేనివిషయములు ప్రకటించును. యిటీవల 1932 సం॥న కంచెల విషయమై రయితులకును ఎస్టేటువారికిని వాగ్ప్రసంగములు జరిగినవి. రిమిషనుల విషయమై జరుగలేదు.

కంచెల విషయమై నేను కలెక్టరుగారితోను, పోలీసు సూపరింటెండెంటు గారితోను సంభాషించుచుంటిని.

1336 ఫసలి క్షామ సంవత్సరము. ఆ ఫసలియందు పంటలు పండలేదు. రూపాయలో యెన్ని అణాల పంటపండినదో చెప్పలేను. యీదావాలో చేరిన మోపూరు గ్రామము జెట్లాగాను. యింత పంటనుపైనపండకుంటె రిమిషను యిచ్చేది అనే నిర్ణయములేదు. యెంత పంట పండితే రిమిషను యివ్వతగునో నేను చెప్పజాలను. రిమిషను అర్జీలు నాకు రాగానే నేను ఆఫీసుకు పంపెదను. దివాను, మహారాజాగారి యుత్తర్వులకైనా ద్వారా పంపుదు. 1336 ఫసలీకి రయితులు సుక్తి అర్జీలను పెట్టుకున్నారు. మోపూరు రయితులుకూడ పెట్టుకున్నారు. అవతల కొంతకాలమునకు యీ అర్జీలు ఫైసలు అయినవి. కాలదోషము మించకుండుటకై రిమిషను తీర్మానములు కాని మొత్తములకు ప్రోనోట్లును వ్రాయించుకొనవలయునని రయితులు కోరగా అట్లు చేయబడెను. మోపూరు రయితులు కూడ అట్లే అడిగిరి. రిమిషను తీర్మానమైనపిమ్మటఅట్టి మొత్తములు ప్రోనోట్లలో చెల్లువేయబడును. ఒకవేళ పూర్తిమొత్తములు అప్పటికే చెల్లించియున్న యెడల రాబోవు సంవత్సరముల శిస్తులోకి యీ ప్రోనోట్ల ముజరా మొత్తము చెల్లుబెట్టుకోబడును. యీ దావా ప్రోనోట్లు వ్రాయించుకొను కాలములో రిమిషను యిచ్చే యెడల అట్టి మొత్తములు యీ ప్రోనోట్లలో చెల్లువేసుకొనే ఏర్పాటు వున్నదో లేదో నాకు తెలియదు. గ్రామాధికారులు సుక్తి రిపోర్టులను యెస్టేటు వారికి పంపిరో లేదో జ్ఞాపకములేదు. అట్టి అర్జీలను గ్రామాధికారులకు పంపు ఆచారములేదు. యెస్టేటుద్యోగులకే అవి పంపబడును. దావా ప్రోనోట్లు వ్రాయించినప్పుడు మోపూరు రిమిషనుల విషయము పరిష్కారముకాలేదు. రిమిషనులకున్నూ దావా ప్రోనోట్లకున్నూ యెట్టి సంబంధమున్నూ లేదు. రిమిషను తీర్మానము కానందువల్ల ప్రోనోట్లు వ్రాయించుకొనబడెను అను వాదమును నేనంగీకరింపను. రిమిషనుల విషయమై సంస్థానము వారు ప్రకటించిన జవాబు నిజమేను.

“(వెంకటగిరి రయితుల కష్టములు” అని రయితులు యింగ్లీషులో శాసనసభ్యులకు పంచిపెట్టిన విజ్ఞప్తికి యెస్టేటువారు ప్రకటించిన ప్రత్యుత్తరములో యీ రిమిషన్ సందర్భమునకు సంబంధించిన వాక్యములిట్లున్నవి.)

“ముజరా విషయము తీర్మానము కానందువల్ల యెస్టేటువారు ప్రోనోట్లను వ్రాయించుకొనుచున్నారని నిందారోపణ చేయుటలో అర్థములేదు. యిట్టి పద్ధతి రయితులకు యేవిధమయిన నష్టమును కలిగించదు. యేలననగా యీ ప్రోనోట్లను వ్రాయించుకొనవలెనను యుద్దేశ్యము వెంటనే దావాల చేయవలెనను యుద్దేశ్యము కాదు. యిట్టి ప్రోనోట్లను సంస్థానము వారు రయితులకు అనవసర దావాఖర్చులను తప్పింపవలెనను సదుద్దేశముతోనే వ్రాయించుకొనుచున్నారు. మీదుమిక్కిలి యిట్టి ప్రోనోట్లవలన సంస్థానము వారికే నష్టమే కలుగుచున్నది. శిస్తుబాకీ, ప్రోనోటు బాకీగా మారినందువల్ల భూమిపైన మొదటి చార్జీగా అమలు జరుపుకొను వసతి పోవుచున్నది.”

దానివిషయమై నేనెట్టి సమాధానము నివ్వజాలను. పై జవాబు జమీందారీ అంతటికిసంబంధించినదేను. మోపూరు రయితుల అర్జీల 1931 సం॥ లో పరిష్కరింపబడినవని తలచెదను. నాకంత దృఢ జ్ఞాపకములేదు. సంస్థానమువారు ప్రత్యుత్తరమును యెప్పుడు ప్రకటించినది నేను చెప్పజాలను. రిమిషను అర్జీలును వానిపై వ్రాయబడిన యుత్తరువులును సంస్థానపు ఆఫీసులోయుండును. 1336ఫసలీలోను 1,80,000లు ముజరాలు యివ్వబడినవి. అవి గొప్ప మొత్తమేను. యెప్పుడు యీ రిమిషనుయిచ్చినది సంస్థానపులెఖ్ఖల వలన తెలియగలదు. 1931సం॥ సెప్టెంబరు అక్టోబరు నెలలో జమీందారుకు రైతులకుమధ్య మనస్పర్థలు ప్రారంభమయ్యెను. కొన్ని పరిష్కరింపబడినవి. కొన్నికాలేదు. మోపూరు గ్రామరయితులు యీమనస్పర్థలలో చేరియున్నారు, యితరగ్రామస్థులుకూడాను. మనస్పర్థలకు మునుపు, తర్వాతనుగూడ యివ్వబడినవి. యెస్టేటు లెక్కల వలన పై 1,80,000 లలో మోపూరు రిమిషన్ లెక్కలున్నది లేనిది తేలగలదు. మోపూరు రైతులు రిమిషన్ సందర్భమున నన్నుసందర్శించిరి. వారిలో ప్రతివాదులున్నారో లేదోనాకు తెలియదు. సన్1336ఫసలీకి రిమిషన్ యివ్వమని కోరిరి. ప్రోనోట్లనుకూడ వ్రాసియిచ్చియున్నామని చెప్పిరి. మొదటరిమిషన్ ప్రస్తాపన జరిగెను. ఆ సందర్భముననే ప్రోనోట్లు ప్రస్తాపన కూడ వచ్చినది. రిమిషన్ యివ్వడమనగా ప్రోనోట్ల వాపసు అనియే కాదు. అప్పుడు తహశీలుదారు అచ్చట యుండినారు. యిప్పుడతను చనిపోయినారు. (చదువుల మునిస్వామినాయుడు) తహశీలుదారుతో, నేను లెక్కలను నాకు పంపించండి చూస్తాను అని చెప్పినాను. యిప్పుడు కోర్టులో “లెక్కలు తెప్పించండి రిమిషనులు యిప్పిస్తాను” అని నేను చెప్పలేదు. నేను సవారికి పోబోవుచుండగా నరసుమహాలులో జరిగినది.

---

## పోలూరు తాలూకా రయితుల కాటక బాధ

యీ తాలూకా వెంకటగిరి సంస్థానము వారిదైయున్నది. యీ రైతులు పుబ్బ కార్తెలలో పైరువేయగా వర్షములు సకాలములో వర్షించనందున దుంప తెగులు తగిలి ఆ పైరంతయు పూర్తిగా చెడిపోయినది. కొన్ని గ్రామాలు యకరాకు వకటి రెండు తూములకంటె జాస్తి అగుట లేదు. చెరువులు యేటికాల్వలు వున్న యేవొకటి రెండు గ్రామములలో పండినవి. కాదలూరు, వెల్లాంపాడు, తిరుపక్కల్, యీవత్తు గ్రామాదులు పంటపూజ్యమనియే చెప్పవచ్చును. వెనుక చిక్క వర్షించిన వర్షమైనను అతిస్వల్పమైనందు వల్ల, భర్తీసాగు చేసుకొనుటకు వీలు లేక పోయినది. రైతులు శుక్తీరిపోర్టులు నవంబరు, నెలలోనే దివాన్ గారికి తహసీలుదారునింవారికి, రిజష్టరు ద్వారా పంపుకొన్నారు యింతవరకు యే గ్రామం తనికీ చేసినట్టు కనుపడదు. యికనెప్పుడు యేస్టేటుద్యోగులు వచ్చి తనికీచేయుదురో రెమిషన్ యిస్తురో యివ్వరో తెలిసినదికాదు. అట్లు తనికీచేసి రిమిషన్ యిస్తామన్నను అధికారుల మోమోటములు తప్పవు. అదిమెట్లున్నను చేప్కారు వారి ఆఖరు అభిప్రాయము యెట్లు తేలునో జరిగిన తాలూకాబోర్డు, డిస్ట్రిక్టుబోర్డు, యెలెక్షన్లలో యేసంబంధము లేని యితరడిస్ట్రిక్టు నివాసులకు వోట్లివ్వమని నిర్బంధించడం, వారినే అధ్యక్షులుగా చేయవలెనని ప్రయత్నించడములో, న్యాయసమ్మతముగా ప్రవర్తించిన రైతులెల్లరు అవిధేయులని అవిధేయలీస్టులో చేర్చినందున రెమిషన్ యిచ్చుటకు వారి మనస్సు ఒప్పకోదు. యీ రయితులు యిప్పటికే కూటికి లేక మలమలమాడి చచ్చిపోతున్నారు. నగా, నట్రా యిదివరలోనే అమ్మి గతఫసలీల శిస్తులకు డిక్రీలకు చెల్లించి నిరాధారులయి నిల్చియున్నారు. యీ సంవత్సరము కృషికి తగిన మెత్తులేక అర్థోగతి పాలై అనుగంటుతా నుండి రిసాలుపడి భగవంతుడాయని పరితపించుచున్నారు. మొన్న జేముక్కిడి అంగుళ్లలో పడినను అన్నట్లు శిస్తులో కవంక జప్తీలో కవంక డిక్రీలను వ్రాసికవంక వావాలోకవంక అనుకున్నా రయితుల కష్టసుఖములు యేమాత్రమును గనని కఠినహృదయులగు స్పెషలు ఆఫీసరుగారు, అన్యాయపుకాలం వచ్చి రయితులు అనుగంటుచుంటె మంచికాలములోనే చెల్లించవలసిన డిక్రీలయి వున్న బాకీలకు అగస్త్యవారంట్లు హాజావిడీలు బెదరింపులు వినినవారికే గుండెలు బద్దలగుచున్నవి. వీరు యీ కష్టసమయములో డిక్రీలు పూర్తిగా చెల్లించువారికి నూటికి యిరవై, ఇరవైయిదు తోసివేస్తూ, నేను రయితులకు మెంతమేలు చేస్తున్నాను అనితనలో తాను సంతోషించడం యీ అన్యాయపు కాలములో నూటికి తొంబయిఅయిదు తోశివేస్తానని చెప్పినను పయికము చిక్కేటెడ? మార్వాడిలే నూటికి రు 60, 70, లు తోసివేయుట వీరికి తెలియదుకాబోలు. ఇదిగాక కొందరు అధికారులు యిదే సమయమని నిర్దాక్షిణ్యముగా వారికి ఋణమాత్రం చల్లగా పోషించుకొనుటకు బెదరించి అదలించి పెరుక్కొనితినడం జరుగుచున్నది.

అంకగుండాల చేనిగుంట గ్రామం.

“అన్ని వకమెత్తు, అగస్త్యులవారొక మెత్తు” అన్నట్లు యీ గ్రామ రయితుల యిక్కట్టులు చెప్పనలవికాదు. యేమన వారి భూములు జబ్బయి శిస్తులు మరింత హెచ్చయి నీటివసతి పూజ్యమయి కూటికి గుడ్డకు కరవయి అప్పుల బాధ అధికమయి నగరు డిక్రీలు హెచ్చయి నానాటికి క్షీణించి పాపరులయి అప్పులుపుట్టక [illegible]నికి తగిన మొక్క సంపాదించుకొనుటకే చాలక యితర జీవనాధారము లేక కృంగి కృశించి మెంతయేడ్చినా దిక్కులేక విద్య నేర్చుకొనను బిడ్డలును మొండికన్నెరుగని స్త్రీలును వ్యవహారించు పెత్తనదార్లను అల్లాడేముడాయని యేడ్చుచు బ్రతుకజాలక కూలివృత్తిమీద నాధారపడి గతసంవత్సరమే భూములు యిండ్లు బంధుస్నేహితుల నన్నిటిని వదలుకొని పరాయిదేశములకు పోయినారు. యీ సంవత్సరం పూర్తిగా పంటలు లేనందున యిప్పటికే కొంతమంది వెళ్ళినారు. మరికొందరు వెళ్ళనున్నారు. అపుడు మొంత, మొన్నని మొరపెట్టినా ససేమిరాయను యీ రాజాగారి పరిపాలనలో నెవరు జీవించగలరు? మరికొందరు లేవలేని సత్తువ పెద్దపులికి వెరచుతుండా అనుసామెతననుసరించి నిర్భయముగా కొంపలలోపడి కుక్కిరి బిక్కిరియనక అర్ధప్రాణాలతో జీవచ్ఛవములయి కృశించుచున్నారు. యీ గ్రామజనసంఖ్య ననుసరించి యెందరు వృద్ధికావాలెనో అందరు వృద్ధియగుటలో జననరిజష్టరుననుసట్టి చాలా వృద్ధి తగ్గియున్నది. కారణము పాఠకులే యోచించగలరు. గాన రయితువారికి రయితులను వర్తకులు మొదలగువారిని ప్రార్థించడమేమనగా యీ సోదర రయితుల కడగండ్లను విచారించి ఆశ్రయమిచ్చి ఆదరించి కూలివారుగను పాలేరులగను తలమనుష్యులుగను గుమాస్తాలుగను యేర్పాటుచేసుకొని పనిపాట్లు కల్పించి వకసంవత్సరము పోషించి పుణ్యము కట్టుకొని రయితుకుటుంబమును నిల్పువలెనని వేడుచున్నాను.

నిర్భాగ్యుడగు
జమీందారీ రయితు

---

జమీందారీ రైతు

18-3-33

శనివారము

## జమీందార్ల రక్షణలు.

జమీందార్లకు రాబోవు రాజ్యాంగములో రక్షణలను గూర్చి విచారించుటకు భారత శాసన సభలో అంక్లె సేరిగారు కోత తీర్మాన ముపపాదించిరి. లాహిరీచౌదరి గారును, కున్వరు రఘువీర సింగుగారును, రాజాబహద్దూర్ కృష్ణమాచారియారు గారును, వ్రిజకిశోర్ గారును, అబుహాశాల్ గారును జమీందార్ల పక్షమున బల్లగుద్దిమాట్లాడిరి. బి. వి. జాదవ్ గారును మొదలియారుగారును రైతుల పక్షమున మాట్లాడిరి. రామస్వామి మొదలియారు గారు, జమీందార్లకు యిదివరకుదగిన ప్రాతినిధ్యమున్నదని యంగీకరించుచు రెండవ శాసనసభకొరకు ఆందోళన చేయవలసినదిగా సలహానిచ్చెను. ప్రభుత్వ కార్యదర్శి బాజ్ పాయిగారు జమీందార్ల యెడసానుభూతిజూపెను. రైతులకు జమీందారులకు సంఘర్షణయున్నట్లు తానంగీకరింపనేను. కాని స్వీకరింప నాతిమాత్రమున యీ సంఘర్షణ అంత మొందజాలదు. తర్వాత ప్రభుత్వ పక్షమున సర్ బి. యల్. మిత్తర్ గారు మాట్లాడుచు రాబోవు రాజ్యాంగమున వ్యక్తికిని, ఆస్తికిని సంబంధించిన హక్కులకు భంగము కలుగకుండునటుల భారత ప్రభుత్వమువారు సిఫారసు చేసిరనియు, ఋజాచర్చలోని భావములన్నియు బ్రిటీషు ప్రభుత్వమువారికి తెలిపెదమనియు, జాస్తివిజమును ప్రతిఘటించవలసిన ఆవశ్యకతయు, ఆస్తికి సంబంధించిన హక్కులను కాపాడవలసిన ఆవశ్యకతయు భారత ప్రభుత్వమువారికి తెలియుననియు చెప్పుచు నూతనరాజ్యాంగపద్ధతులు దినముల మీదనున్నవనియు అవిచవి చూచువరకు ఆగవలసినదిగా కోరినంతట తీర్మానము నుపసంహరించుకోబడినది.

పైవిషయముల బట్టిచూచిన జమీందార్ల ప్రయత్నము లెంతతీవ్రముగ నుండునదియు, రాబోవు రాజ్యాంగమున రైతులనోట మట్టిగొట్టుటకు జమీందారులు పూర్తిపన్నాగముల బన్నుచున్నారనియు తెలియుచున్నది. మొన్న వెంకటగిరి కుమారరాజాగారు ఢిల్లీకి తరలుటలో గొప్పకారణము లేకపోలేదు. అసంబ్లీసభ్యుల తమవలలో వేసికొనుటకే ననియూహింప తగియున్నది. సర్ అబ్దుర్ రహీముగారు వీరనిపరి చయ మొనర్చుటలోనే జమీందార్లకుట్రలకు అసంబ్లీసభ్యులు ముగ్ధులైరని యూహించ తగియున్నది. కావుననే జమీందార్లరక్షణలగూర్చి భారత శాసనసభలో చర్చింపబడినపుడు జమీందార్ల పక్షమున మాట్లాడువారి సంఖ్య హెచ్చుగనుంటయు, రైతులగూర్చిమాట్లాడువారు ఒకరిద్దరి కంటె లేకపోవుటయు, సంభవించినది. రాబోవు రాజ్యాంగములో రాష్ట్రీయ శాసన సభలలో ప్రజాయత్తమున నుండబోవుల్యాండు రెవిన్యూశాఖపై గూడ రక్షణలనడుగుటయు, ప్రభుత్వము వారు సంబతముకొంతకన్న నెగుర వేయుటయు జాడగా రాబోవుసంస్కరణలు, ఎండమావులుగా నూహించతగియున్నవి.

ఈతరుణమున జమీన్ రైతుల ప్రతినిధిగా పోట్లాడవలసిన గుంటూరు, నెల్లూరు జిల్లాల అసంబ్లీప్రతినిధిపోనాగోవింద రెడ్డిగారు నెల్లూరును వదలి పోకుండుటమిగుల శోచనీయము. ఇట్టియదను న రంగనాయకులుగారు లేనిలోటును మా రైతులు బాగుగా గుర్తించియుందురు. ఇకముందైనను జమీందారీ రైతులు మేల్కొని తమముక్తి తమచేతులలోనే యున్నదని గమనించి జిల్లాసంఘముల బలపరచుకొని, రాష్ట్రీయసంఘమును పునరుద్ధరించి తన్మూలమున తమకష్టములీడేర్చుకొనుటకు అన్నిసంస్థలకు జమీన్ రైతుల ప్రతినిధుల నేపంపి జమీన్దారులకుట్రల భంగపరచి స్వీయాభ్యుదయమునకు పాటుపడెదరని కోరుచున్నాము.

## బహిరంగలేఖకు సమాధానము.

రా॥ మాలకొండారెడ్డిగారు వ్రాసిన బహిరంగలేఖను స్థలాంతరమున ముద్రించితిమి.

విలేఖకులు వ్రాయుయుదంతముల నిజానిజముల గమనించి ప్రకటించుటకు పత్రికాధిపతులకు వీలుగానిపని. ఆయుదంతములందు సత్యేతరములున్న యెడల వెంటనే యదార్థమును తెలిసినవారు ప్రకటించుటసముచితముగాని చిందులుద్రొక్కుట అసభ్యము. రెడ్డిగారు యదార్థమును తెలిపి మావిలేఖరివ్రాతల ఖండించినందులకు నందనములు.

విలేఖకులు పత్రికలకు వ్రాయునపుడు విషయయదార్థముల చక్కగా తెలుసుకొనియే వ్రాతురని కోరుచున్నాము.

రెడ్డిగారి బహిరంగలేఖలోని తక్కిన అసందర్భపు వ్రాతలు వారివిశాల భావనిదర్శనములు. "త్వంశుంఠాం త్వంశుంఠా" యనుటకు మేము పూనుకొననందులకు రెడ్డిగారు మన్నింతురుగాక. రెడ్డిగారి నూత్న భావాంకురములను మాయింటే స్వాతంత్ర్య భావారుణ కాంతులనాహ్వానించు తెనుగులోకము గుర్తెరుగుట అవసరము.

# సతీ సక్కుబాయి.

అను నాటకమును

## శ్రీ సింహపురి నాట్యమండలి వారు

## 23-3-33 రాత్రి 9-30 గం॥ గురువారం.

సూళ్ళూరుపేట జయ గోకులహాలులో

ప్రతిష్ఠాంతరు మెలగు విచ్చేసాక్షితులు.

అత్రి:- కళాకోవిద, బాలకవి, వి. సుందరరామశర్మగారు.

కృష్ణుడు:- నటశేఖర యస్. రామదాసయ్యంగార్.

మహాభాగసంఘాధ్యక్షురాలు:- కోటా) వేంకటచలంగారు.



సక్కు:- రంగకోకిల, యం. బాలకృష్ణమూర్తిగారు.

శివయోగి:- గానసరస్వతి, వి. వేంకట రామానుజాచార్యులుగారు.

విశ్వనాథభట్టు:- యం. [illegible] గోవిందసింగుగారు.

—: రేట్లవివరము :—

పురుషులకు:- 2-0-0, 1-8-0, 1-0-0, 0-8-0, 0-4-0.

స్త్రీలకు:- 0-8-0, 0-4-0

---

## రామాయణంలో—పిడకలాట

(లగా లగీ)

అరేమడార్ "బీస్‌హజార్, అంటె మొత్తెమొత్తం ఛాయి?

ఉర్ఛాయి, సూరు రూపాయి నోట్లు అయితె బీస్‌హజార్ అవుతుంది సర్కార్!

(2)

రెడ్డి:—శెట్టిగారూ! మొన్న నెల్లూరు శెట్టివారితో సూలూరుపేట రయిసుమిల్లుల వ్యవహారం చెప్పారంటనే యేమిటి దాని నిజం?

శెట్టి:—రామరామ యేముందా కొడు తెరుగునయ్యా! అన్నిటికి కోమటోళ్ళ లోకవని మాపేరు ముందుకు తేకపోతే కడుపులో మంటుండే పెద్దమనుష్యుల పేరే బైటబెట్టుకోరాదూ?

రెడ్డి.—యింతటికీ నీవెరగనే మరగవా?

శెట్టి:—చెప్పుతో కొట్టవయ్యా! చెప్పినవాణ్ణిగాని, విన్నవాణ్ణిగాని,

రెడ్డి:—సరేగాని రైసుమిల్లుల విషయం నిజమేమిటో బైటపెట్టు.

శెట్టి:—మావూళ్ళో కొన్ని రైసు మిల్లులు గ్రామానికి సమీపంలో వున్నవి. వాటిలో వడ్లు వుడకబోసిన నీళ్ళు మురిగి నందున ఆరోగ్యానికి భంగమని జిల్లాహెల్తుఆఫీసరు వారు తనిఖీచేసి యూనియన్ బోర్డుకు వ్రాస్తే వారు జోక్యము పుచ్చుకొని మిలు యజమానులకు తెలిపి కొంత సరుబాటు చేశారు. అంతేగాని యూనియన్ బోర్డువ్రెసిడెంటు ఓటకోసరం ఉమాదిరి చేశాడనడం తప్పనుకూతలు.

(3)

(నాయుడుపేట ప్లాటుఫారం మీద)

కంట్రాక్టరు } అయ్యా మీదేవూరు?
నాయుడు }

మొదలారి:—మాదిదా నాయుడుపేట.

నాయుడు:—నాయుడుపేట, కాళహస్తి రోడ్డు లోనుండి అగ్రహారప్పేట బ్రాంచిరోడ్డు వేస్తారన్నారే! ఆకంట్రాక్టు ఎవరికిచ్చారు?

మొదలియారు:—కావేటిపాకం అరసప్ప మొదలియార్ మొట్టమొదట మొత్తము పంకొ జాస్తిపెరసంటు తగ్గించినా టెండరు పెట్టాడంటారు. సుబ్బరాఘవరెడ్డిగారి తరపున తక్కువపెరసంటు తగ్గించి టెండరు పెట్టాడంట. 15% పెరసంటు తగ్గించి సుబ్బరాఘవరెడ్డిగారికే యిచ్చారని బజారులో వదంతిగావుంది.

నాయుడు.—సరేగానీవుంది. యీమాదిరి తగ్గించి కోరినవారికివ్వకుండా హెచ్చుటెండరులు పెట్టినవారికిచ్చినందున బోయినసంవత్సరం రు 18000 లు జిల్లాబోర్డుకు బుక్కాన్ వచ్చిందని ప్రజాప్రతినిధులంటే యిట్టివారినేగా యెన్నుకొన్నామని చదువుకొన్నవారంతా డంకాకొట్టేది?

---

## బోర్డు కన్యా విలాపము.

( కవిత. )

నాయకుడు బోర్డు కన్యను వివాహమాడి నేటికి 37 దినములు. వధువు యొక్క తల్లిగారింట మూడురాత్రులయినను వరుడునివసించుటహిందూసాంప్రదాయము కాని కన్యాస్వగృహమున అడుగుపెట్టి ఆమె మేలి ముసుంగయినను తొలగించినపాపమున పోలేదు. ఆమెపూర్వజన్మ దాంపత్య మోహమున ఈజన్మలో సంయుతము వారినే వరునిగాకేయ తుమ్మిపువ్వుముల ఈశ్వరారాధనచేసినది. ఆమెమున్కనను భగవంతుడు సంయుతము మన్నించి వాంఛితునే వరునిగా దత్తముచేసెను. కానియేమిలాభము? నోటిమాటకంటెనూపయినను ఆమెకులభింపలేదు. కంటికి కడివెడుగా యేడ్చుచున్నది. ఉపనాథుపయినను కంటితో చూచుచూ కొంతయూరట పొందియుండెను, వారు సంయుతము వారముదినములనాడు యిదిగో వత్తునని ధర్మరాజపట్టాభిషేకమునకు హస్తినాపురికేగె. పాపము ఆమెదుఃఖమునకు మేరలేదు. స్వయంవరదినమున చక్కట్లు దిద్దిన సభాస్థారులెల్లరు కంటికగుపడుటలేదు కౌను! వారివారి కార్యములు తీరినవెనుక యితరుల క్షేమమునయి వారికేమిమక్కవ? వివాహమహోత్సవమున రెండు అక్షతలు నెత్తినజల్లి భూరివిరాళములతో తరలిన పురోహితాది బ్రాహ్మణ్యమును తలచుకొని ఆమెచింతించుచున్నది. తలవనితలంపులన్నియు ఆమెను చింతాభరమున కుంగదీయుచున్నవి. నూత్నవధువు. ఒకనాడయినను ప్రియునిదర్శనముకాలేదు. ప్రియనాథునికంఠసీమనలంకరింప తెచ్చిన కుసుమమాలలు వాడిపోవుచున్నవి. చందనము సెత్తిపోయినవి. సువాసనలు గంధవహుని గలసిపోయినవి. ఆత్మేశ్వరుడు నాల్గుదినములనాడు గ్రామశేకటాహాఘుడై చెన్నపురి కరుగుచున్నాడని విని పట్టలేని తమకమున తెలచి త్రివుప నంపి నాథుని స్వహస్తమున ముద్రాంకితమైనను చేసిన పత్రమునగనుడునని ఆదేశమంపెను. దూత, నాథుని కలుసుకొని ఆత్మపత్ని ఆదేశమును నివేదించెను. బాలుంనాశ్యనినుగ్నుతసుప్రియుడు. దత్తుణనాయకుడగుటచే అవసరమున ఆమెసందేశమును గైకొని స్వహస్తలిఖితాక్షరముల అనవాలుగ వ్రాలుచేసెను. దూతకొంత దూరము తోడ చని ముద్రాంకిత పత్రము లగొని వెనుమరలుటలో తొకటావేగమున మాత్ర ప్రమాద రహితశ్రీ గాత్రుడగుటయు జరిగెను. విశ్వాసపాత్రుడగు దూతి హృదయ నాథుని ముద్రాంకితమును ప్రియ ప్రియకు సమర్పించి ప్రాణేశ్వరుని సందేశమును వినిపించెను. మరియొక నెల దినములు హృదయేశ్వరుని చూడజాలమికి ఖిన్న మానసయై ఆకోమలహృదయ మేడ పైకెరి అర్ధరాత్రిమున వెన్నెల బయల ఇట్లు విలపించుచున్నది.

### గేయము.

" నాకుత్తుకే జిక్కె-నా ఓబ్రహ్మ నామ్మ్రు
త్తికే దక్కె-నా
పలుకరి నోళ్ళల్లో-నానింది పిల్లోళ్లు
కల నైననానాథు-గాంచకుండితినిట్లు
లోకాన్ని వదిలేసిక్షుణకపై కన్నెసి
చీకు చింతలదోపి-చిదిపిరే నావాసి
ఒకనెల పదినాళ్ళు-ఊపిరెట్లుందేను
తికమక బ్రతుకాయె-దిక్కు-దెలి
యక పోయె
చింతే మిక్కు-టమాయె-కలుగులా
మొందాయె
స్నేహితంబా పోయె-జీవితము
సున్నాయె
తొలి జన్మలో బుద్ధి-గలిగింది
బాలకే
మలి జన్మలో గాఢ-మలిన
మాయెను తనువు
చక్కట్లు దిద్దిన-సవతులందరు నేను
దిక్కు- మొక్కు- జూచి-తెలియ
బల్కరదేమో"

## నె॥ అ॥ డి॥ ము॥ కోర్టులో

స్యాలు 2214 of 1932.

పూండ్ల బలరామిరెడ్డి- వాది

ఆగేకంటి పుల్ నెవ్వ,
కారుమంచి, పత్తికొండ
తాలూకా, కర్నూలుజిల్లా } ప్రతివాది

యీ ప్రతివాది పెన్నా వెంకటరెడ్డి కి తే 20 12 1929 ది వ్రాసియిచ్చియున్న ప్రోనోటును వాది ట్రాన్సుఫరు పొంది పై నెంబరున ప్రోనోటు అసలుఫాయిదాలను రాబట్టుకొనుటకు దావా దాఖల్ చేసియున్నాడు. సదరు దావా తే 20-3-33 దికి వాయిదా వేయబడియున్నది. ప్రతివాదికి యేమైనా ఆక్షేపణలున్న యెడల వాయిదానాడు పగలు 10 గంటలక్కు కోర్టువారియెదుట హాజరయి ఆక్షేపణలను తెల్పుకోవలెను. లేనియెడల ప్రతివాది పరోక్షమున విచారించి తీరుమానించ బడునని ఇందువల్ల తెలుపడమైనది.

నెల్లూరు.
16-3-33 } చింతలపల్లి వెంకటరెడ్డి, వాది వకీలు.

## జమీందారీరైతు పత్రిక

## సంపాదకులకు బహిరంగలేఖ

మీరు తే 4-3-33ది పత్రికయందు కనిగిరి తాలూకా అనుత్పత్తికను ప్రచురించియున్నారు- అందులో నాస్వంతయిల్లును జప్తిచేసి బోర్డు సైనాళ్ళకు కొనుగోలు చేయుటకు సంకల్పించుకొనినట్లు వదంతిగా యున్నదని వ్రాసినారు. సాధారణముగా మీ పత్రికలో వెలువడు నిందారోపణ అసత్యపు వ్రాతలకు ప్రత్యుత్తరము నిచ్చుటకు నాకు తీరిక కాల వ్యవధులు లేకున్నను యీ విషయం మా 3 తాలూకాలకు లాభించు సైనాళ్ళు గానను, జిల్లా బోర్డు సోదర సభ్యులును తదితరులును మీ పత్రికలో వెలువడు వ్రాతలు యింతవరకు సత్యమునకు దూరమై వ్యక్తిద్వేషముచే వ్రాయబడినవని తెలుసుకొన గలందులకై ప్రత్యుత్తర మివ్వను కించుచున్నాను.

(సశేషము.)

---

ఏప్రిలు తే 2 దిన జమీందారీ రయితు మహాజనసభ జమాపులో జరుగును.

## వ్యవసాయక పారిశ్రామిక పశుప్రదర్శనము

పై ప్రదర్శనము 12 తేదీనుండి 16 తేదివరకు చాలజయప్రదముగ జరిగెను. మదరాసు పారిశ్రామిక డైరెక్టరు శ్రీయుత వి. రామకృష్ణ యం. ఎ., ఐ. సి. యస్. గారు ప్రదర్శనమును 12 తేదివుదయము తెరచిరి. శ్రీయుత దొడ్లమురుకృష్ణారెడ్డి గారు నెల్లూరుమండలవ్యవసాయ సంఘము తరపునస్వాగత పత్రమును చదివిరి. ప్రదర్శింపబడిన వస్తువులు విశేషముగ స్వదేశి వస్తువులు. పశువులు విశేషముగ రాకపోవుటచే బహుమతు లివ్వబడలేదు. శ్రీయుత రామకృష్ణగారు ప్రదర్శనమును తెరచుచు మృదుమధుర పలుకులిటుల నుడివిరి.

ఈదేశమున చెరకుపంటకును చక్కెర పరిశ్రమాభివృద్ధికిని అమూల్యమైన అవకాశములుండియు విదేశమునుండి అమితముగ చక్కెర దిగుమతియగుట విచారకరమనియు, యీపరిశ్రమవృద్ధి పొందకుండుటకు ముఖ్యముగ ఫలితమిచ్చు సన్ననిచెరకునుగాక ఫలితము తక్కువయిచ్చు లావాటి చెరకును పండించుటయే కారణమనియు, సన్ననిచెరకు విశేష ఫలితమిచ్చుటయేగాక చక్కెరను తయారుచేయుటకు కాలహరిమిలేని సౌద్యుగ కలిగించుననియు, పూర్వపు మదరాసు శాసనసభాధ్యక్షులు శ్రీయుత సి. వి. యస్. నరసింహరాజుగారికి సి. ఒ. 213 చెరకుపంట వకయకరాకు ను 52 లు ఖండయి 40 టన్నుల చెరకు పండెననియు. నెల్లూరుజిల్లా యీపంటయందు చాలవెనుకబడియున్నదనియు, చెరకు నుండిగాక యీత తాటి చెట్లనుండియు చక్కెరను తయారుచేయుటకు అవకాశములు కలవనియు, నెల్లూరుజిల్లా అగ్రికల్చరల్ డిపార్టుమెంటువారి యొక్కయు పెదపవని జమీందారుగారి యొక్కయు సహాకారముతో తాముయీచెట్లనుండి చక్కెరను తయారుచేయు పరిశ్రమను రాబోవు ఏప్రిలుమాసమునఆరంభించెదమనియు, చక్కెర పరిశ్రమకు ప్రభుత్వమువారిచ్చు సహకారమును పూర్తిగ నుపయోగించుకొని సత్వరముగ మనదేశమున కావశ్యకమైనంత ఉత్పత్తి చేయవలయుననియు, గెంటుభారముల విషయములోను మనదేశము చాల వెనుకబడియున్నదనియు, చక్కని పద్ధతుల మీద వీటిని నిర్మించి పశువులకు సరియైన ఆహారముల నొసంగినవెన్న, కండెన్సుడు పాలు మొదలగు వస్తువుల దిగుమతులను నరికట్ట వచ్చుననియు, మనదేశము అధికముగ వేరుశెనగను అన్యదేశములకు యెగుమతి చేయుచున్నదనియు, నూనెను తయారుచేయు పరిశ్రమను యిచ్చటనే నెలకొల్పి యెగుమతిచేయు వేరుశెనగను యిచ్చటనే పూర్తిగా వుపయోగించుకొనిన చాలలాభకరముగ నుండుననియు, గానుగపిండి, గోధుమ మొదలగు పైరుల కద్భుతమయిన యెరువనియు, పశువులకు బలము కలిగించు ఆహారమనియు, ఇంగ్లండునకు గోధుమల నెగుమతిచేయుటకు విశేషఅవకాశములు కలవనియు, మార్కెటుపరిస్థితుల గమనించి ఈవ్యాపారమును ప్రోత్సహింపవలయుననియు, నుడివిరి.

పిమ్మట రామిరెడ్డిగారు నెల్లూరు మండల వ్యవసాయసంఘము వారిప్రార్థన నంగీకరించినందుకు డైరెక్టరుగారు ప్రదర్శనమును తెరచినందులకు కృతజ్ఞతాపూర్వకవందనములర్పించిరి.

మాస్వంతవిలేఖరి-

---



## నె॥ డి॥ అ॥ ము॥ కోర్టులో

అసలు 1932 సంవత్సరము నెం 1294 రు.

రావి. వెంకటరామానాయుడు-వాది

అందు

ముప్పరాజు సుబ్బానాయుడు- ప్రతివాది.

యీ నెంబరు వాదిపేరటికి ప్రతివాది వ్రాయించి యిచ్చియుండు ప్రాంశరినోటు తాలూకు అసలు వాయిదాలు రు 558-10-0 లు మొత్తమును రాబట్టుకొనుటకు యీ దావా జరిపియున్నారు. యీ నోటీసుపై ప్రతివాది తనకు యేదయినా ఆక్షేపణలు యున్నయడల 1933 మార్చి నెల తే 28 ది పగలు 10 ఘంటలకు పై కోర్టుయెదుట హాజరుఅయి తెలుపుకోవలయును లేనియెడల యీ దావా ప్రతివాది పరోక్షమందు తీర్మానించబడును.

17-3-1933 నెల్లూరు. } ఆమంచర్ల హనుమంతరావు. వాదివకీలు

---

## నె॥ అ॥ డి॥ ము॥ కోర్టులో

E. P No. 2415 of 1932.

O. S. No. 357 of 1931.

క. తిరువెంగళంనాయుడు వాది.

అందు

పిల్లారిశెట్టి రంగనాథరావు-ప్రతివాది

వాదిపేరటికి ప్రతివాది వ్రాయించి యిచ్చిన రిజష్టరు ఆడుమాన దస్తావేజును పట్టి వాది డిక్రీపొంది ఆడుమానం ఆస్తిని వేలమునకు తెచ్చియున్నారు. సదరునెంబరు ప్రతివాదికి వేలం నోటీసు జారీకాగలందులకు గాను తే 8-4-1933 ది వాయిదా వేయబడియున్నది. గనుక ప్రతివాదికి ఆడుమానం ఆస్తి వేలము వేయుటలో యేమైనను ఆక్షేపణలు వున్నయెడల తే 8-4-1933 ది పగలు 11 ఘంటలకు యీ కోర్టువారియెదుట స్వయముగా గాని లేక వకీలుద్వారాగా గాని తెలుపుకోవలయును. లేనియెడల ప్రతివాది పరోక్షమునందు విచారించి తీర్మానం చేయబడును.

నెల్లూరు 17-3-33 } నేలనూతలసుబ్బరాయుడు వాదిఅడ్వొకేటు

## నకలుమందులను చూచి మోసపోకుడు

నలుబది సంవత్సరములుగా ప్రఖ్యాతిజెందినది. కేవలము బాధసాధని.




తలనొప్పుల మాన్పును, వాయుపోటుల కాపును, పార్శ్వపు నొప్పుల కారదోలును, పొట్ట పోగొట్టును, బెణుకుల ఛేదించును, వాపుల రూపుమాపును, దగ్గును తగ్గించును, దురదను తొలగించును.

మద్రాసు, మైసూరు రాష్ట్రములకు ముఖ్యపు ఏజంట్లు,
శ్యాం అండు కంపెని,
6, బందరువీధి, మద్రాసు



అమృతాంజనం డిపో,
మద్రాసు, బొంబాయి,
కలకత్తా.

## ఉపాసనా ప్రభావము

---

మీ ధనిమిత్తులలోని ప్రశ్నలకు దివ్యదృష్టివలన సరియైన సమాధానములను వ్రాసి వి.పి. పోష్టుద్వారా మీకు పంపుదుము. 6ప్రశ్నలకు రూ. 1-4-0. 12ప్రశ్నలకు రూ. 2-4-0.

మీ గృహములయొక్కయు, పనిశాలలయొక్కయు, లేక నూతనస్థలములయొక్కయు ప్లానులను చేసిపంపిన వాట్లయొక్క బలాబలములను; అంన్య,వాస్తు, . భూగర్భశల్య జల ప్రవాహ పిశాచాది దోషము లున్నవో లేవో పరిశోధించి చూచియుండినచో వాటికి శాంత్యాది విధులు మొదలగు ప్రతియంశములను విపులముగా మీకు తెల్పుదుము.- ఇందులకు వి. పి. ఖర్చులతో సహా వాస్తు రూ.2-40

సమగ్రవ్యాధులు తొలగుటకును ప్రయోగ లక్షణములు విడిపోవుటకును భూత ప్రేత పిశాచముల బాధలు తొలగుటకును సమస్త వశీకరణాదులకును మహామంత్రయంత్రతాయెత్తులుపంపుదుము.

ఆడ్రసు:— "మాంత్రిక చక్రవర్తి"
ప్రొఫెసర్ అంజన్, ఎం. ఇ,
అక్కల్‌కోట్, బెజవాడ.

# డెర్బి స్వీప్ (లాటరీ)

## మ్యూచుయల్‌క్లబ్బు లిమిటెడ్ వారిచే నడుపబడుచున్నది.

చందా, మామూలు టపాకు తే 26 4 33 ది వరకు టిక్కెట్టు 1-కి రు 4 12 0 లు.

---

## ఐరిష్ హాస్పటలు వారిచే నడుపబడినది.

---

ది 12–4–33 వరకు మామూలు టపాకు టిక్కెట్టు 1–కి రు 7–12–0

ఈపై రెండుక్లబ్బులటిక్కెట్లు నిమిత్తమున్ను ఈదిగువ అడ్రసుకు సొమ్ముతో ఆర్డరుపంపుకొనవచ్చును.

టి. వి. రెడ్డి,
అధికారమును పొందిన ఏజెంటు.

రాజమండ్రి (తూర్పు గోదావరిజిల్లా.)

సంపాదకుడు, ముద్రాపకుడు, ప్రకాశకుడు, నెల్లూరు, వెంకటాద్రిమానాయుడు, జమీందారీరైతు ముద్రాలయం, రాజవీధి, నెల్లూరు.